# శ్రీ భాస్కరశతకమ్.

(ఆన్ధ్రతాత్పర్యసహితమ్)

శ్రీమాన్ ఖండవిల్లి వేంకటాచార్య
విరచితమ్

శతావధాని బ్రహ్మశ్రీ పుసర్ల సూర్యనారాయణశాస్త్రిభిః
పరిశోధితమ్



శ్రీమాన ముడుంబ వెంకటరంగ అనహారాచార్యాణాం
ధనసాహాయ్యేన రాజమహేన్ద్రవరస్థ శ్రీవివాస ముద్రణాలయే
ముద్రాపితం సత్ విజయతేతరామ్.
1938.

 (*Price: 0-2-*

శ్రీవిఖనసగురవే నమః

# శ్రీ భాస్కరశతకము

1. లక్ష్మీం పద్మగృహావాసా మవాప్తుమివ భాస్కరః।
వికాసం పద్మకోశస్య వితన్వన్ శ్రేయసేఽస్తు వః॥

తా. పద్మమనే గృహమందుండు లక్ష్మిని పొందుటకో యన పద్మముకుళమును వికసింపజేయుచున్న భాస్కరుడు మనకు శ్రేయం బొసగుగాక।

2. ఉదయాద్రిం గతే యస్మిన్నరుణారుణమణ్డలే।
జగద్రూపమహాసౌధం దీప్తిమత్సోఽవతు స్వయమ్॥

తా. యెర్ర నెర్రని మండలముగల యెవడుదయపర్వతమును బొందగా జగద్రూపమయిన మహాసౌధము (పెద్దమేడ) తేజోవంత మాయెనో ఆభాస్కరుడు మనలను రక్షించుగాక!

3. గగనారణ్యసంచారి తమోగజవిమర్దకః।
కిరణాస్రకృపరిక్లిన్న జటాఢ్యో భానుకేసరీ॥

తా. ఆకాశమనే మహారణ్యమందు సంచరించుచున్న చీకటి అనే గజమును మర్దించగా కిరణములు అనే ఎఱ్ఱని జడలను ధరించియున్న సూర్యుడనే మృగరాజు ప్రకాశించుచుండెను.

4. ప్రాచీ గర్భే దధానా యం ముక్తే రైతైకపాణ్డుతామ్।
ముక్తాతారావిభూసాఽఽప సోఽయం రక్షతు భాస్కరః॥

తా. ప్రాగ్దిక్కాంత యెవనిని గర్భమందు ధరించినందున ముఖ

మందు మొగలిరేకుయొక్క తెల్లదనమును ధరించి నక్షత్రములనే భూషణములను విడచెనో ఆభాస్కరుడు రక్షించుగాక!

5. గగనార్ణవసంజాతాః ప్రవాలాః పుఞ్జితా ఇవ।
యదీయం మణ్డలం భాతి సోయం గస్తు భాస్కరః॥

తా. ఆకాశమనే సముద్రమునబుట్టి పోగుచేయబడిన పగడపు రాశివలె ప్రకాశించు మండలముగల భాస్కరుడు బ్రోచుగాక!

6. బహుమార్గం మనఃపూరం త్వద్భక్తిక్షేత్రమాయతమ్।
నయ జ్ఞానాఙ్కురాస్సర్వే జీవన్తి చ ఫలన్తి చ॥

తా. అనేక మార్గములుగ బోవుచున్న మనః ప్రవాహమును నీయొక్క భక్తియనెడు క్షేత్రమును పొందింపుము. అక్కడ అణగియున్న జ్ఞానాంకురములు జీవించి ఫలించును.

7. త్వత్కరైర్హేమవర్ణైస్తై ర్వ్యాప్తా తుహినమణ్డలీ।
వివీతా దిగ్వధూటీనా మవగుణ్ఠపటీ యథా।

తా. ఓస్వామీ! సువర్ణవర్ణముగల నీయొక్క కిరణములచే దుహినపటలము దిక్కాంతలయొక్క పచ్చనిమేల్ముసుగులువలె ప్రకాశించుచున్నది.

8. ప్రభాతే కలమా రేజు ర్బాలాతపసమావృతాః।
శలాకా ఇవ సౌవర్ణా విక్షిప్తా బహుసున్దరాః।

తా. ప్రాతఃకాలమున లేత యెండచే నావరింపబడిన వరిమూనలు బంగారుకణికలవలె నున్నవి.

9. సంకోచమాప కల్హారం దృష్ట్వా త్వాం నైతదద్భుతమ్।
సవర్ణోదయం లోకే సవర్ణస్సహతే న హి॥

తా. త్రిజగన్నాయకా! నిన్నుజూచి యెఱ్ఱకలువపూవులు ముకుళించు

టలో ఆశ్చర్యమేమియు లేదు. లోకములో సవర్ణులయొక్క ఉదయమును జూచి సవర్ణులు సహింపరుగదా!

10. ఏకం కువలయం హృష్టం త్వయి దృష్టే దివాకర।
అన్యన్ముకులితం శీఘ్ర మిదం పరమమద్భుతమ్॥

తా. ఓ తండ్రీ! నిన్నుజూచి ఒక కువలయము వికసించినది; మరి యొక కువలయము ముకుళించినది. యిది పరమాద్భుతము, (ఒకకువలయ మనగా భూమండలము; మరియొక కువలయమనగా కలువపువ్వు.)

11. ఉదితే త్వయి సున్యక్తం న తారా భాన్తి భాస్కర।
విద్యుద్దీపసమీపే తు ఖద్యోతో న విరాజతే॥

తా. ఓస్వామీ! నీవుదయింపగా నక్షత్రములు ప్రకాశింపవు. విద్యుద్దీపముదగ్గర మెరుగుడుపురుగులు శోభిల్లవుగదా!

12. ఉదిత్వరే త్వయి వ్యోమ్ని దృశ్యమానం స్ఫుటం జనైః।
నీహారపటలం సాన్ద్రం నితరాం ప్రవిరాజతే।

13. దివాభవిష్యదాహార లోపమాశఙ్క్య రాత్రిషు।
చకోరైస్సంచితం జ్యోత్స్నా కరంభమివ నిర్మలమ్॥

తా. ఓ సూర్యనారాయణమూర్తీ! నీవాకాశమున నుదయింపగా స్పష్టముగా కానవచ్చుచున్న తుహినపటలము (మంచు), పగలు చంద్రుడు లేకపోవుటచే తమకాహారమయిన వెన్నెల దొరకదని యెరింగియున్న చకోరపక్షులచే రాత్రులయందే కూడపెట్టుకొనబడిన వెన్నెలవలెనున్నది.

14. సాన్ధ్యరాగపరివ్యాప్తా స్తామ్రాస్తోయదపఙ్క్తయః।
పుష్పస్తబకసంశోభి కింశుకారణ్యసన్నిభాః॥

తా. సంధ్యారాగముచే నెఱ్ఱబడిన మేఘపంక్తులు విరిగబూచిన మోదుగచెట్లవలె నున్నవి.

15. తిష్ఠన్తు కవయోఽన్యస్యే తావకస్తోత్రకారిణః।
కల్పద్రుమశ్రితైః కైశ్చిదితి కిం త్యజ్యతే బుధైః॥

తా. నీయొక్క స్తోత్రమును జేసియున్న కవులనేకు లుండిన నుందురు గాక. అయినను నేను నీస్తోత్రమును చేయకవిడువను. ముందుగనే కొందరిచే నాశ్రయింపబడినదని కల్పవృక్షము ప్రాజ్ఞులచే విడువబడునా?

16. అజానన్తో హృదిస్థం త్వా మన్యదేవానుపాసతే।
ఉపధానీకృతామశ్మ చ్ఛిలాం క్రోశోఽత్ర లక్ష్యతే॥

తా. కొందరు తమ హృదయమందున్న నిన్ను తెలిసికొనజాలక నితర దేవతల నుపాసింతురు. ఇది కొండను తలక్రింద నిడుకొని రాళ్లను వెదకినట్లున్నది.

17. విమూఢో విషయగ్రామం స్థిరం మత్వాఽనుధావతి।
మృగతృష్ణాం నదీంబుద్ధ్వా పిపాసుర్హరిణో యథా॥

తా. మూర్ఖుడు శబ్దాది విషయములనే స్థిరములనినమ్మి, యెండ మావులను నదులని తలచిన లేడివలె పరుగిడును.

18. గగనారణ్యసంజాత బన్ధూకస్తబకోపమమ్।
ఆదిత్య భవతో బిమ్బం సంతతం భావయామ్యహమ్॥

తా. ఓస్వామీ! గగనమనెడు మహారణ్యమందుబుట్టిన మంకెన పూవువలె నున్న నీయొక్క బింబమును నెల్లప్పుడు భావనచేయుదును.

19. సంసారం పరమం స్థానం మేనిరే త్వాం విహాయ యే।
కాచమేవ మహారత్న మఙ్గీకుర్వన్త ఏవ తే॥

తా. యెవరు నిన్నువిడచి సంసారమునే పరమపదమని తలతురో వారు గాజురాయిని మహారత్నముగ నంగీకరించినవారే.

20. యే నరా ఉషసి స్నాత్వా అర్ఘ్యం దదతి తేఽనఘః।
త్వదీయబిమ్బతుల్యాని తేషామాస్యాని భాస్కర॥

తా. ఓస్వామీ! యెవరుదయమున భక్తియుక్తులై నీకర్ఘ్యము నొసంగుదురో వారిముఖములు నీబింబమువలె ప్రకాశించునవగును.

21. జగన్మూలం భవానేవ నాన్యః కోప్యత్ర విద్యతే।
యత్సర్వం భవతోదేతి భవతా ప్రవిలీయతే॥

తా. ఓదేవా! నీవే జగత్తునకుపాదానకారణము. మరియొకడు లేడు. కనుకనే జగమంతయు నీతో నుదయించి నీతో నస్తమించుచున్నది.

22. త్వాం దృష్ట్వా తమసాం సంఘా దిగఞ్చలముపాశ్రితాః।
ఆలోక్య మాన్త్రికశ్రేష్ఠం పిశాచా ఇవ భీరవః॥

తా. ఓభాస్కరుడా! నిన్నుచూచి చీకట్లు, మాంత్రికునిజూచి భీతిల్లిన పిశాచములమాడ్కి దిగంతముల నాశ్రయించినవి.

23. త్వయా విశోషితం మార్గం రత్నగర్భాతి పాణ్డరమ్।
దీర్ఘం సమాశ్రితా హ్యత్ర సీమన్తోన్నయనేవ సా॥

తా. జగన్నాయకా! రత్నగర్భ (భూమి; యీరత్నగర్భావిశేషణము హేతుగర్భితము) నీచే యెండింపబడి తెల్లనైన మార్గమును ధరించుటచే సీమంతసంస్కారము జెందినదివలె నగపడుచున్నది.

24. త్వదీయానేకకిరణాన్ సంగరేష్వనివర్తినామ్ ।
అసంఖ్యానాం భటానాం తు శఙ్కే స్వర్గపథాన్పృథక్ ॥

తా. అసంఖ్యములయిన నీకిరణములను యుద్ధమందు హతులైన మహావీరులయొక్క భిన్నభిన్న వీరస్వర్గ మార్గములని తలతును.

25. తవాపి భూతలస్యాపి వివస్వన్మహదన్తరమ్ ।
తథాపి దుస్సహం తేజః కిం విదూరం మహాత్మనామ్ ॥

తా. ఓనారాయణమూర్తీ! నీకును భూమికిని చాల దూరమున్నది. అయినను భూమియందు నీతేజస్సు సమీపమందున్నట్లు దుస్సహముగ నున్నది. మహాత్ములకు దూరమనగానేమి?

26. విద్యాపోషకసద్భావే విద్యా భాతి విశేషతః ।
ఆశ్రియ స్తమ్భ మాశ్రిత్య లతా ఖలు విజృమ్భతే ॥
తా. విద్యాపోషకులుండిన విద్యలు మిగుల శోభిల్లును. ఆధారస్తంభముండిన గదా లతలు విజృంభించును.

27. మార్తాణ్డ త్వం మహాదేవ లక్ష్మీవానసి సన్తతమ్ ।
తస్మాన్మహ్యాం మహాలక్ష్మీం సుఖాద్దాతుం సమర్హసి॥
తా. జగద్రక్షకా! నీవు నిరంతర లక్ష్మీసంపన్నుడవు. కావున నాకు సంపదలను సుఖముగ నొసంగుటకు నీకు వీలగును.

28. రామకృష్ణాదిరూపేణ పూర్వం తత్తద్యుగే భవాన్ ।
మర్దయన్నసురానీకం పాలయ న్సజ్జనానభూత్ ॥
తా. నీవే రామకృష్ణాద్యవతారములనుదాల్చి పూర్వయుగములయందు రాక్షసులను సంహరించి సజ్జనుల గాపాడితివి.

29. ఘోరవ్యాధిమహాసర్ప గరుడాదిత్య సౌఖ్యద ।
ఆరోగ్యం సంపదం వృద్ధిం కురు మే సర్వపోషక॥
తా. ఘోరవ్యాధులనే మహాసర్పములకు గరుత్మంతుడవయిన ఓసూర్యనారాయణమూర్తీ. నాకారోగ్యమును సంపదను వృద్ధిని నొసంగుము.

30. దేహో నౌకా భవాం స్తస్యాః పతిస్సంసృతిరమ్బుధిః ।
జీవ స్తత్ర స్థితః పాన్థ స్తారయైనం దివాకర ॥
తా. ఓతండ్రీ! దేహమే ఒకనౌక, నీవు దానికధిపతివి, యీసంసారము సముద్రమువంటిది. జీవు డానౌకలోనున్న పాంథుడుగాన వానినావలి దరి జేర్పుము.

31. త్వామేవాదిత్య విద్వాంసః ప్రభాతే భక్తిసంయుతాః ।
వేదమన్త్రం సముచ్చార్య గాయత్రీం పర్యుపాసతే ॥

తా. ఓస్వామీ! ప్రాతఃకాలమున భక్తియుక్తులయిన విద్వాంసులు వేదమంత్రము నుచ్చరించి నిన్ను గాయత్రిగానుపాసింతురు.

32. ప్రతీచీభామినీనూత్న సంగమోత్సవలోలుపే ।
త్వయి పక్షికలారావై స్తూర్యనాదాయితం విభో ॥

తా. ఓస్వామీ! నీవు పశ్చిమ దిక్కాంతా ప్రథమసంగమోత్సవ మభిలషింపగా పక్షులయొక్క కలకలరవములు మంగళతూర్య నాదము లగుచున్నవి.

33. మదాన్ధా ధనికాః ప్రాయో మత్సరీ బాన్ధవో జనః ।
పితా స్వర్గం గతః శ్రేయా న్భాస్కర త్వం గతిర్మమ ॥

తా. ధనవంతులు తరుచుగా మదవంతులు, బంధువులు పరశ్రేయ మును సహింపలేనివారు, సమస్తకార్య ధురంధరుడైన తండ్రి లోకాంతర మునకు జనెను, ఓసర్వేశ్వరా! నీవే నాకుగతి.

34. నిద్రాహారవిహారైక ప్రధానం జీవితంజనాః ।
కుర్వన్తి పరమాత్మానం భవన్తం న స్మరన్తితే ॥

తా. మూఢజనులు తమ జీవితమును నిద్రయు నాహారము ప్రధాన ముగా కలదానినిగా చేయుచున్నారు, కాని పరమాత్మ రూపుడవయిన నిన్ను స్మరింపరు.

35. సన్మార్గగమనో నిత్యం ద్విజరాజవసుప్రదః ।
లక్ష్మీవానివ లక్ష్మీవా న్భాసతే భువి భాస్కరః ॥

తా. ఎల్లప్పుడు సన్మార్గమున ప్రవర్తించునట్టియును ద్విజరాజవసు ప్రదుడయినట్టియును లక్ష్మీసంపన్నుడయిన భాస్కరుడు లక్ష్మీసంపన్నుడు వలె నున్నాడు.(సన్మార్గమనగా ఆకాశము, మంచిమార్గము. ద్విజరాజవసు ప్రదుడనగా చంద్రునకు కాంతినిచ్చువాడును, బ్రాహ్మణులకు ధనము నిచ్చువాడును.)

36. ప్రాగ్వధూహస్తవిక్షిప్తో రవీరత్నాఢ్యకన్దుకః ।
అస్త్రాద్రిభిత్తిసంహత్యా పునః ప్రాచీం గతస్తతః॥

తా. ఈసూర్యుడు ప్రాగ్వనితారత్నముచే విసరబడిన రత్నపుబంతి వలె ప్రకాశించుచున్నాడు. కనుకనే అస్త్రాద్రియనే గోడకు తగిలి తిరిగి తూర్పుదిక్కును పొందుచుండెను.

37. నాహం శుకో మహాన్వ్యాస స్తథాపి మయి తే కృపా।
తుఙ్గే ద్రుమే తృణేల్పేపి సమం మేఘో హి వర్షతి॥

తా॥ నేను వ్యాసునివలెను శుకునివలెను గొప్పవాడనుగాను. అయినను నాయందు నీకృపయుండునని నాసంకల్పము, మహావృక్షమందును నత్యల్పమయిన తృణమునందును మేఘుడు సమముగనే వర్షించునుగదా!

38. ఏకస్యానన్దమాలోక్య సహతే నేతరో భువి ।
పరైరద్వేష్యమానన్దం తావకం దేహి భాస్కర॥

తా॥ ఓస్వామీ! లోకములో తరచుగా ఒకనియానందము జూచి మరియొకడు సహింపడు. ఇతరులకు ద్వేషింపరాని పరమాత్మరూపుడవయిన నీయొక్కతత్వసందర్శనానందమును దయచేయుము.

39. కశ్చిల్లోకే ధనీ కశ్చి ద్దరిద్రః కశ్చిదాత్మవాన్ ।
కశ్చిత్కవిర్జడః కశ్చిత్కర్మభేదోత్ర కారణమ్॥

తా॥ లోకమున నొకడు ధనికుడు, మరియొకడు దరిద్రుడు. ఇంకొకడు పరమాత్మజ్ఞానముకలవాడు. మరియొకడు కవి. మరియొకడు జడుడు. ఇట్లు వేరువేరుగా నగపడుటకు స్వస్వసంచితకర్మభేదమే కారణము.

40. మార్తాణ్డ మానవాః ప్రాయో విషయాసక్తచేతసః।
స్వతన్తుపటలాన్తస్థ లూతాకీటోపమా అహో॥

తా. తరచుగా మానవులు శబ్దాదివిషయముల నలవడి తానల్లుకొనినగూడులోనున్న సాలిపురుగువలె నున్నారు

41. కల్పోక్తవిధినా భక్తాః పాయసేనాజ్యగన్ధినా।
రక్తాక్షతైర్యజన్తి త్వాం రక్తమాల్యానులేపనైః॥

తా. భక్తులు కల్పోక్తప్రకారముగ పాయసముచేతను యెఱ్ఱని అక్షతలు మాలికలు మొదలగువానిచేతను నిన్ను బూజింతురు.

42. సహస్రం భవతః పాదానేకోఽయం కథమర్చతి।
తస్మాదనేన సుప్రీతో భవ స్తోత్రేణ భాస్కర॥

తా. ఓజగన్నాయకా, అనేకములయిన నీపాదములను నేనొక్కడ నెట్లర్చింతును? గాన యీస్తోత్రముచేతనే దృప్తుడవగుము. (పాదశబ్దమునకు కిరణము పాదముగూడ అర్థము)

43. ఖరస్వరః కథం మూర్ఖో జానాతి కవితారసమ్।
ముక్తాహారస్య సౌన్దర్యం వేత్తి కిం మర్కటో వద॥

తా. మూర్ఖుడు కవితారస మెట్లెరుంగును. ముత్యాలపేరుయొక్క అందమును మర్కటము తెలిసికొనగలదా?

44. వర్షాకాల ప్రభాతేషు బ్రహ్మాణ్డం సచరాచరమ్।
త్వద్బాలాతపమేకస్మి న్నన్యత్రాభ్రబ్దమణ్డలమ్॥

45. ధృత్వా పాకవశాదర్ధే పీతం శేషేఽతిమేచకమ్।
రసాలమివ బాభాతి దర్శనీయం సదర్శనైః॥

తా. వర్షాకాలములో ప్రాతఃకాలమున నీలేతయెండ యొకవైపునను నల్లనిమబ్బులొకవైపునను నొప్పుచుండ నీబ్రహ్మండము పండుటచే కొంత భాగముపచ్చగను కొంత నల్లగనుఉండు పెద్దమామిడిపండువలె నుండును.

46. సద్యోకమఖిలం విశ్వం కరణ్డం సోఽర్ధ్వ సంపుటం।
ద్యుమణిస్తత్ర నిక్షిప్త స్సుమణిర్బహులద్యుతిః॥

తా. ఆకాశముతోకూడిన యీప్రపంచము మూతగలబరిణెవలెనున్నది. సూర్యమండలము అందుంచబడిన మహారత్నమువలె ప్రకాశించుచున్నది.

47. భాషణేప్యుద్ధతస్సోయం కురుతే విప్రియంవచః।
ఆత్మగుప్త్యా యథాకర్ణానాం సంస్పృష్టోఽపి యదృచ్ఛయా॥

తా. దూలగొండ పొరపాటున తాకినను దురదను పుట్టించుమాడ్కి గర్విష్ఠుడు మాట్లాడగనే కఠినప్రత్యుత్తరముచే వ్యథను గలిగించును.

48. అస్య మత్సరిణో దేవ న్యగ్రోధేనాస్తి తుల్యతా।
యన్నమృష్యత్యదూరస్థం నాఙ్కురోపి యదన్తికే॥

తా. ఓతంత్రీ: పరశ్రేయమునుజూచి సహింపనివానిని మఱ్ఱి చెట్టుతో పోల్చవచ్చును. వాడసహనభావమున నితరులను దూరముగ బారదోలును. మఱ్ఱిచెట్టు, దగ్గరమొలకనైన మొలవనీయదు.

49. ధ్యానహీన తపస్సక్తః ఫలం నాప్నోతి మన్దధీః।
జలశూన్యం శరన్మేఘ మాశ్రిత శ్చాతకో యథా॥

తా. ధ్యానహీనముగ తపస్సుచేయువానికి జలశూన్యమైన శరన్మేఘము నాశ్రయించిన చాతకమునకుబోలె ఫలము గలుగదు.

50. అధీత్యాల్పం మహాగర్వమాప్నోతి పురుషాధమః।
ఈషత్ఫలస్తరుర్వాయనా పరం చాఞ్చల్యమాప్నుయాత్॥

తా. స్వల్పముగ చదివినవానికి గర్వమధికము. కొలదిగకాచిన చెట్టు గాలివేయునప్పుడు మిక్కిలి విఱ్ఱవీగును.

51. మహీరుహాపలాశాన్త ర్దృష్టాశ్చిత్రా భవత్కరాః।
పీఠ ప్రలమ్బిక్రీడార్థ చిత్రసూత్రధియం దదుః॥

తా. చెట్లయాకులనడుమ గానవచ్చునీకిరణములు అనేకవర్ణములుకలవై గుండ్రని బల్లచెక్కనుండి వ్రేలాడు కోలాటపుత్రాళ్ళవలె నగపడుచున్నవి.

52. సర్వే భవన్తు మద్దాసా ఇత్యాశాస్తే దుష్టమానసః ।
పరాత్పరస్య దాసోఽహమితి జ్ఞానం న విన్దతే ॥

తా. దుష్టుడు జనులందరు తనకు దాసులుకావలెనని తలచును. నేను సర్వేశ్వరునకు దాసుడనెడు జ్ఞానమునుమాత్రము చెందడు.

53. వేదాన్తవాదినస్సర్వే విరలాస్తత్త్వదర్శినః।
వాచారమ్భాః క్రియాశూన్యాః ప్రాయశో భూతలేజనాః॥

తా. అందరును వేదాంతులే. బ్రహ్మతత్త్వమెరిగినవారరుదు. తరచుగ జనులు ప్రతికార్యమును వాక్కుచేప్రారంభించి క్రియాశూన్యులగుదురు.

54. తవ స్తోత్రం విధాతవ్యం సమరే విజిగీషుభిః।
అత్రోదాహరణం శ్రీమా న్రామో దాశరథిః స్థితః॥

తా. యుద్ధమందు జయముగోరువారు నీస్తోత్రమునుపఠించవలెను. ఆదిత్యహృదయమును జపించి శ్రీరాముడు జయము గాంచెనుగదా!

55. అన్నవాన్పురుషోఽత్ర స్యా దస్తి చేద్భవతః కృపా।
అత్రోదాహరణం రాజా ధర్మాత్మాఽస్తి యుధిష్ఠిరః॥

తా. ఓస్వామీ! నీకృపగలదేని మానవుడన్నముగలవా డగును. నీకృపవలన, "అక్షయాన్నభాండమును" ధర్మరాజు పొందెనుగదా!

56. విద్యార్థీ లభతే విద్యా ఉపాస్య త్వాం దివాకర।
నవవ్యాకరణజ్ఞోఽత్ర ప్రసిద్ధో హనుమాన్మహాన్।

తా. విద్యార్థి నిన్నుపాసించెనేని సమస్తవిద్యల నొందును నిన్నుపాసించి నవవ్యాకరణజ్ఞుడై హనుమంతుడు ప్రసిద్ధినొందెను గదా!

57. మహాతే యాజ్ఞవల్క్యాయ తవ శిష్యాయ ధీమతే॥
అద్వైతబ్రహ్మవిజ్ఞానం త్వయా దత్తం ప్రభాకర॥

తా. శిష్యుడైన యాజ్ఞవల్క్యునకు నీవు బ్రహ్మతత్త్వముపదేశించితివి.

58. వేఙ్కటేశ్వరమాహాత్మ్యం యముద్దిశ్య మయా కృతమ్।
త్వమేవ దేవ సోఽప్యాసీ ర్నామ్నాం భేదో న తే భిదా॥

తా. ఎవరినుద్దేశించి "వేంకటేశ్వరమాహాత్మ్యమును" వ్రాసితినో ఆదైవముకూడ నీవే. ఆలోచింపగా నామవాచకములకు భేదముగలదుగాని పరమాత్మవైన నీకు భేదములేదు.

59. జ్ఞానాయో త్సారితం భూయ ఆవృణోతి జనం తమః॥
పిపాసుహ స్తవిక్షిప్త శ్శైవాలస్సరసీం యథా॥

తా. దప్పిక కలవానిచే స్వాదుజలముకొరకు దూరముగ తొలగియబడినను నాచు తటాకము నెట్లావరించునో పరబ్రహ్మమును చూచుటకు ప్రయత్నపూర్వకముగ విడువబడినను తమఃపటలము (అజ్ఞానము) శీఘ్రముగ మానవునాక్రమించుచున్నది.

60. త్వత్కరైర్వైకవర్ణాస్తే తృణాగ్రహిమబిన్దవః॥
ఇన్ద్రనీలప్రవాలాద్యై ర్మిలితా ఇవ మౌక్తికాః॥

తా. ప్రాతఃకాలమున నీకిరణములు పడుటచే తృణాగ్రమందున్న హిమబిందువులు నానావర్ణములుగలవై ఇంద్రనీలములు, పగడములుమొదలగు సమస్తరత్నములతో గలసియున్న ముత్యములవలె నున్నవి.

61. ప్రతిబిమ్బాని తే నద్యో దధానాస్తరలోర్మిషు।
పవనాకమ్ప్యమానోద్య స్మన్దారస్రగ్ధరా ఇవ॥

తా. నదులు తరంగములయందు నీప్రతిబింబములను ధరించి మందారమాలికలను ధరించినట్లగపడుచున్నవి.

62. స్వర్ణశ్రియా విమూఢస్య మానసం పఙ్కమశ్నుతే।
విమలాన్యపి వర్షాసు కేదారాణి యథా రవే॥

తా. తెలివిలేనివానికి ధనమువచ్చెనేని వానిమనంబును పాపము, వర్షాకాలమందు జలసమృద్ధిచే పరిపొలములను బురదవలె ప్రవేశించును.

63. సాధుచిత్తం న గర్వేణ పూర్యతే విభవేఽధికే।
కూలఙ్కషనదీపూర సహస్రేణేవ వారిధిః॥

తా. మహానదులెన్ని ప్రవేశించినను సముద్రమెట్లు పూరింపబడదో అట్లే ద్రవ్యమధికమైనను సజ్జనచిత్తము గర్వముచే నింపింపబడదు.

64. సర్వదా కిల సర్వత్ర త్వమేవ మమ రక్షకః।
సర్వవ్యాపీ దయావార్థి రితి తే మహతీ ప్రథా॥

తా. ఎల్లప్పుడు నెల్లతావులందును నీవే నాకురక్షకుడవు. సర్వవ్యాపి, దయాసముద్రుడు అని నీకు గొప్పకీర్తి కలదుగదా!

65. మధ్యాహ్నాతపయోగేన వర్తులం వియదద్భుతమ్।
పిశుభ్రవస్త్రఖణ్డోద్య దదణ్డచ్ఛత్రసన్నిభమ్॥

తా. మధ్యాహ్నపుటెండతోకూడినఆకాశముతెల్లగొడుగువలెనున్నది.

66. ఆత్మనః పూర్వవృత్తాన్త మస్మరన్పురుషాధమః।
ఉన్నతం స్థానమాసాద్య సాధూనేవ ప్రబాధతే।

తా. పురుషాధము డున్నతస్థానమునుబొంది తనయొక్కపూర్వవృత్తాన్తమునుమరచి మంచివారలనే బాధించును.

67. బధిరస్య యథా గానం యథాన్ధస్య ప్రదీపికా।
తథా పాపాత్మనః పుంసో జ్ఞానోక్తిర్నోపయోగ్యతి॥

తా. చెమిటి వానికి గానమువలెను, గ్రుడ్డివానికి గ్యాసులైటువలెను పాపాత్మునకు జ్ఞానోక్తులెంతమాత్రము ఉపయోగింపవు.

68. సుచిరాధ్యయనైర్యస్య సాహంతీ నోపజాయతే।
జానన్నివ వదన్నర్థ మర్థజ్ఞైసోఽపహాస్యతే॥

తా. చిరకాలము చదివియు పాండిత్యముకుదరనివాదహంభావముతో ప్రతిపదమునకర్థము చెప్పుచు పాత్రజ్ఞులచే పరిహసింపబడును.

69. కామాదయః ప్రభుం త్వాం తు పిధాయ ప్రభవన్తి తే।
కృత్వాఽదృశ్యం మహారాజం దుర్మన్త్రిపరిషద్యథా॥

తా. దుష్టమంత్రివర్గము మహారాజును బ్రచ్ఛన్నునిగాజేసి స్వయముగ ప్రభుత్వము చెలాయించునట్లు కామక్రోధాదులు సర్వభూతస్థిత పరమాత్మవైన నిన్ను కప్పివేసి తామే స్వేచ్ఛగ వ్యవహరించుచున్నవి.

70. అసమర్థస్స్వయం వక్తు మన్యత్రాన్యాన్ప్రచోదయన్।
అసమర్థోఽపి పూజ్యోఽయ మధికారం వచో యథా॥

తా. స్వయముగ చెప్పుటకు సామర్థ్యములేక ఇతరస్థలములకుబోయి నితరుల బ్రోత్సహించునసమర్థుడు వ్యాకరణశాస్త్రమందు చెప్పబడిన అధికారవాక్యమువలె గౌరవింప దగియున్నాడు. (అధికారవాక్యమనగా ఒక వాక్యముచెప్పపడిన స్థలములో స్వయముగనే ప్రయోజనముచేయజాలక తరువాత నుండెడివిధివాక్యముతో కలసి ప్రయోజనము సాధించునది)

71. నోపైతి మానవో ముక్తిం భక్తిముత్సృజ్య భాస్కర।
అనారూఢాద్యసోపానః ప్రాసాదం కథమృచ్ఛతి॥

తా. మొదటి మెట్టెక్కక మేడయెక్కుటయెట్లు అసంభవమో అట్లే భక్తిని విడచి మానవుడు మోక్షమును జెందుటఅసంభవము.

72. భాస్కర త్వత్కరవ్యాజ తామ్రసమ్మార్జనీధరాః।
మార్జయన్తీవ దిక్కాన్తా స్తమస్సంకులమమ్బరమ్॥

తా. ఓస్వామీ! నీకిరణములనే యెఱ్ఱని చీపుళ్ళనుధరించిన దిక్కాంతలచే తమస్సంకీర్ణమయిన ఆకాశము తుడువబడుచున్నది.

73. పద్మినీకుముదిన్యోస్సా ప్రథమా భవతః ప్రియా।
తతస్తస్యాః కృతో హర్ష స్తోషయేత్కః పరప్రియామ్॥

తా. పద్మిని కుముదిని అనెడు రెండిటిలో మొదటిదినీకు ప్రియురాలుగాన దానికి హర్షము (వికాసము సంతోషము) యిచ్చితివి. పరప్రియ కెవరుహర్షమిత్తురు!(కుముదినిచంద్రునకు ప్రియయగుటచేనామెకియ్యలేదు.)

74. ధర్మార్థకామమోక్షేషు లోకసంస్థితిహేతుషు।
ద్వితీయం చ తృతీయం చ సేవన్తే ప్రాయశో జనాః॥

తా. ధర్మార్థకామమోక్షములను నాల్గుపురుషార్థములలోను రెండు మూడు పురుషార్థములనే తరచుగా జనులు సేవించుచున్నారు.

75. సర్వేప్సితప్రదాతారం భజన్తి త్వాం జనాశ్చ యే।
ఏకదైవ చతుర్వర్గ స్తేషాం సిధ్యతి భాస్కర॥

తా. ఎవరు సమస్తపురుషార్థ ప్రదాతవైన నిన్ను సేవింతురో వారికి నాలుగు పురుషార్థములు నొక్క పర్యాయముగనే సిద్ధించును.

76. భాషాజ్ఞానవిహీనేభ్యో మహాగ్రన్థో న రోచతే।
దన్తపజ్క్తివిశూన్యేభ్య ఇక్షుదణ్డో యథా రవే॥

తా. దంతములు లేనివారికి చెరకు కర్ర రుచింపనట్లు భాషాజ్ఞానము లేనివారికి మహాగ్రంధములు రుచింపవు.

77. విద్యారూపశరీరస్య శక్తిః కోశోపసేవయా।
ఓజస్స్వాదురసాస్వాదా త్కవితా యౌవనం తతః॥

తా. విద్యారూపశరీరమునకు కోశ (గ్రంధములు ధనము) సేవచే శక్తి కలుగును. స్వాదురసమును గ్రోలుటచే నోజస్సు (తేజస్సు ఓజో గుణము) కలుగును. పిమ్మట కవిత్వమనే యౌవనముద్భవించును.

78. అర్జయన్తి ధనం లోభా ద్భోక్తాన్యస్తస్య విద్యతే।
సరఘాసంగృహీతస్య క్షౌద్రస్యేవాత్ర భాస్కర॥

తా. కొందరు తామనుభవించక ధనమూర్జింతురు. ఆధనము ననుభవించువాడు మరియొకడుండును. తేనెటీగలు కూడబెట్టుకొనినతేనె నితరులనుభవించుట లోకమునకు తెలిసియే యున్నది.

79. ఫలం దానం ధనస్యాహు ర్విద్యాయా అపి భాస్కర।
కవితాయాః ఫలం తావ త్తావకస్తోత్రపద్ధతిః॥

తా. ధనమునకును విద్యకును దానము చేయుటయే ఫలము, కవిత్వమునకు నీయొక్క స్తోత్రముచేయుటయే ఫలము.

80. దుర్లభా గ్రన్థకర్తార స్సులభాస్తద్విమర్శకాః।
పచన్తో విరలా యోగ్య మాస్వాదీ సులభో జనః॥

తా. గ్రంథములను రచించువారరుదు. విమర్శకులనేకులు. బాగుగ పచనముచేయు వారరుదు. రుచులచెప్పెడివార లనేకులు.

81. దిగీశోనుదినం సాయం త్యక్త్వా తే దక్షిణోత్తరే।
తత్సమీపాయనే సమ్యగాశ్రిత్య త్వాం ప్రభాకర॥

82. ప్రతీచీమేవ వాల్లభ్యా ద్గన్తాస్యాలోకితో ఖిలైః।
ప్రభూతరాగిణో నామ వృత్తమేతాదృశం ఖలు॥

తా. ఓభాస్కరుడా! ప్రతిదినము సాయంకాలమున దిక్పతివైన నీవు దక్షిణోత్తర దిగ్నాయికలను విడచి తత్సమీపమార్గమున పశ్చిమ దిక్కాంత నొక్కదానినే నత్యాసక్తితో పొందుచుంటివి. లోకములో విశేషరాగము కలవారికిదియే లక్షణము. (రాగము=అనురాగము, ఎరుపు)

83. హృదాలవాల మాస్థాయ భారతీకల్పవల్లరీ।
వర్తతే తన్మమానేక సూక్తిరత్నసమృద్ధతా॥

తా. నాహృదయమనే పాదునందు భారతియనే కల్పలత వృద్ధి పొందియున్నది, కనుకనే నాకు సూక్తిరత్నములు సమృద్ధిగనున్నవి.

84. శితాగ్రా స్తోయదా నీలాః కమ్పితా మరుతా రవే।
ధావదుత్క్షిప్తశుణ్డాఢ్య శుణ్డాలనివహా ఇవ॥

తా. వాడియగు కొనలుగల నీలమేఘములు గాలిచే కదల్పబడినవై తుండముల నెత్తుకొని పరుగిడు ఏనుగులగుంపువలె నగపడుచున్నవి.

85. చఞ్చలా శ్చఞ్చలా శ్శక్ర వియద్వారవధూమణేః।
సవ్యే భుజే పరిస్పన్దం ఘన సంసర్గ సూచకమ్॥

తా. మెరుపులను ఆకాశవారవనితారత్నముయొక్క ఘనసంసర్గ సూచకమగు వామభుజపరిస్పందమని తలతును. (ఘనసంసర్గము = మేఘ సంబంధము, గొప్పవారి సంబంధము.)

86. అభితః కిరణైర్జుష్టం తావకం బిమ్బముజ్జ్వలమ్।
పరివేషం సమాసాద్య వర్తులం సుమనోహరమ్॥

87. స్వర్ణారనేమిసంయుక్త మహాచక్రస్య మధ్యగా।
మాణిక్య పిణ్డికేవాసీ ద్ద్యాయం పశ్యత భో జనాః॥

తా. అంతటను వ్యాపించిన కిరణములుగల నీబింబము గుండ్రని పరివేషమును (గూడు) ధరించి, బంగారపు ఆకులతోను పట్టాతోను కూడియున్న పెద్దచక్రమున కూర్చబడిన మాణిక్యపు కుంచమువలె నున్నది.

88. సప్తాశ్వరథమారుహ్య త్వయి వార్ధిము పాశ్రితే।
త్వదశ్వక్షుణ్ణమార్గశ్రీ స్తేజోరేఖా విలోక్యతే॥

తా. నీవు యేడుగుర్రముల రథమెక్కి పశ్చిమసముద్రమును ప్రవేశింపగా ఆగుర్రపుడెక్కలచే నలిగినమార్గమువలె ప్రాక్పశ్చిమదిగ్వ్యాప్తమైన తేజోరేఖ విరాజిల్లుచున్నది.

89. త్వయా మరీచిజాలాని య త్క్షిప్తాని నభోమ్బుధౌ।
జ్ఞాత ఏవ మయా హేతు ర్మీనరాశి స్తద న్తరే॥

తా. నీచే ఆకాశసముద్రమున కిరణజాలము విసరబడుటకు దానిలో మీనరాశియుండుటయే కారణము. (జాలమనగా సమూహము, వలలును)

90. వర్షాసు పల్వలే సార్ధ్రై స్త్వామాచ్ఛాద్య ఘనాఘనైః।
విముక్తా ఉత్పత న్త స్తే విమలాస్తోయబిన్దవః ॥

91. సపీఠాని మనోజ్ఞాని స్ఫాటికాని ధరాతలే।
స్పృజన్తి శర్వలిఙ్గాని శతశోఽథ సహస్రశః॥

తా. వర్షాకాలమందు మేఘములు నిన్ను కప్పివేసి పల్వలముల యందు (కొలదిగ నీరుగల గోతులు) ఉదకబిందువులను విడచుచున్నవి. అవి నీటిలో ఎగురుచున్న వై పీఠములు గల వేలకొలది స్ఫాటికశంకర లింగములను ప్రదర్శించుచున్నవి.

92. త్వామేవ శరణం మన్యే నేతరానాశ్రయామ్యహమ్।
స్థితే మన్దాకినీపూరే కో వా గచ్ఛతి పల్వలమ్॥

తా. నిన్నే రక్షకునిగా తలతును. ఇతరుల నాశ్రయింపను. గంగ యుండగా పల్వలమునకు ఎవడేగును.

93. న కేవలమరణ్యాభం నాప్యమ్భోధితులం నభః।
నక్రకర్కటమత్స్యాద్యా యత్రాజః కేసరీ వృషా॥

తా. ఆకాశము మకర కర్కట మత్స్య రాశులనే జలచరము లుండుటచే అరణ్యముతో పోల్చుటకు వీలుకాకున్నది. మేషసింహ వృషభరాశులనే స్థలచరములుండుటచే సముద్రముతో పోల్చుటకును వీలుకాకున్నది.

94. పుష్కరం పుష్కరశ్రీకం హంస స్తామ్రపద స్తతః।
యుక్తమేతదిదం చిత్రం తత్రర్క్షనివహో ఇతి॥

తా. పుష్కరము పుష్కరమువంటిది. (ఆకాశము నీరువలె నగపడుచున్నది.) గనుక అచ్చట యెఱ్ఱని పాదములుకల హంసయున్నది. (యెఱ్ఱనికిరణములు కల సూర్యుడున్నాడనుట.) ఇది యుక్తమే. గాని. దానిలో ఋక్షసమూహముున్నదనుట మాత్రము అతిచిత్రముగనున్నది.

(భల్లూకములున్నవనుట విరోధము. నక్షత్రములున్నవనుటచే విరోధ పరిహారము.)

95. ఛాయాదానేన పాన్థానాం మరున్నున్నాః పయోముచః।
ఆతపత్రం క్షణం నీల మాసన్వహానవర్జితమ్॥

తా. గాలిచే కదల్పబడిన మేఘములు బాటసారులకు నీడనిచ్చుచున్నవై క్షణమాత్రము మోయుట అవసరములేని నల్లనిగొడుగగుచున్నవి.

96. త్వద్రథాశ్వా వియన్నీలం గోచరం ఘాసపూరితమ్।
మన్వానా ఇవ పూర్వాద్రేః ప్రాపున్నవ న్త్యదితత్వరాః॥

తా. ఓస్వామీ! నీరథమునకుకట్టిన గుర్రములు నల్లని ఆకాశమును పచ్చికబయలు అని తలచి ఉదయపర్వతమునువదలి శీఘ్రముగ పోవుచున్నవి.

97. తావకోదయరాగేణ రఞ్జితం వ్యోమ భాస్కర।
వ్యోమకేశపిశఙ్గోద్య జటాజూటధియం దదౌ॥

తా. నీవుదయించినప్పుడు ఆకాశము పిశంగవర్ణముగల శంకర జటాజూట భ్రాన్తిని కలుగజేయుచున్నది.

98. అద్వైత బ్రహ్మ తత్త్వార్థ వేదినో గురవో మమ।
అద్వైత బ్రహ్మ విజ్ఞానం వితరన్తీతి నిశ్చయః॥

తా. అద్వైతబ్రహ్మ మెరింగిన గురువులు నాకద్వైతబ్రహ్మవిజ్ఞాన మొసంగుదురని నా నిశ్చయము.

99. శతసంఖ్యై రసోపేతై స్సదా మోదకరైశ్శుభైః।
పద్యపుష్పైర్మయా భక్త్యా పూజితస్త్వం దివాకర॥

తా. ఎల్లప్పుడు పరిమళించునవియు ప్రాజ్ఞులకు ప్రమోదజనకము లయినట్టియు రసభూయిష్ఠములయినట్టియు శతసంఖ్యగల పద్యపుష్పము లచే నీవు పూజింపబడితివి.

100. య ఇదం శృణుయాన్నిత్యం పఠేద్వా భక్తిసంయుతః।
సోయం విద్యాం మహాప్రాజ్ఞః పరాం ప్రాప్నోతి భాస్కర॥

తా. ఎవరు భక్తితో యీ భాస్కరశతకమును విందురో చదువుదురో వారు శ్రేష్ఠమైన విద్యను పొందుదురు.

శ్రీభాస్కరశతకం సర్వం సంపూర్ణమ్.

## శ్రీమాన్ ఖండవిల్లి వేంకటాచార్యులుగారు రచించిన సంస్కృత గ్రంథములు.

| | | |
|---|---|---|
| 1. శ్రీవాడపల్లి వేంకటేశ్వర క్షేత్ర మాహాత్మ్యము. | } | 0—8—0 |
| 2. శ్రీ భాస్కరశతకమ్ (ఆన్ధ్రతాత్పర్యసహితమ్) | } | 0—2—0 |

3. (అన్నవరం) సత్యనారాయణశతకమ్ (అచ్చులో నున్నది)

4. భావమంజరీ (అచ్చులో నున్నది)

శ్రీనివాస ప్రెస్, రాజమండ్రి.